శ్రీ

గౌరీవల్లభ పరబ్రహ్మణేనమః.

# సత్యారమేశ శతకము.

ఇది

బ్ర॥ కొత్తపల్లి సుందరరామయ్యగారి శిష్యుండగు


సబ్బవరపు చిన వేంకటాచార్య

విరచితము.


---

కులకవిపోషక బిరుదాంకితులగు

బ్రహ్మశ్రీ అలుగోలు గంగరాజాచార్యులుగారి

ద్రవ్యసహాయమున


ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రచురింపఁబడియెను.

ఏలూరు.

1934.

మొదటికూర్పు 1000 ప్రతులు.




[వెల 0—3—0

# విజ్ఞప్తి.

ఆర్యులారా!

చిరకాలమునుండి నాకు శ్రీమన్నారాయణమూర్తి యగు శ్రీ సత్యనారాయణమూర్తిపయి నధికమగు భక్తి యుండుటం జేసి యొకశతకము వ్రాసి యా స్వామి కంకిత మీయనుత్సాహము మనస్సుననున్నను తద్రచనకు నేసమర్థుండ ననితలంచి, కొంతభాషాజ్ఞానము నలవరచుకొని వ్రాయవలయు నని చిత్తమునకు సమాధానము చెప్పియూరకుండుచు వచ్చితిని గాని, నాకా దేవునియందుఁగల భక్తియే నన్నుత్వరపెట్టుటచే భాషాజ్ఞానమంతగా లేకున్నను నేనీశతకమును వ్రాయఁదల పోసి కొన్నిపద్యములు వ్రాసి నాగురువులగు బ్రII సుందర రామయ్య గారికిఁ జూపఁ గొన్నిఛందోవ్యాకరణ దోషములు చూపి సవరించి, యీపద్ధతిని తప్పులు దొరలకుండ శతకము ప్రారంభించి వ్రాయుమని యాజ్ఞనిచ్చినను, నేనేజాకె యెట్లు శతకమును వ్రాసి ప్రకటింపఁగలవని సందేహించి యూరకున్నతరి నామిత్రులును ముఖ్యబంధువులునగు బ్రII రామోజు రామ మూర్తిగారును, మII గొఱ్ఱెల లక్ష్మయ్యగారును, ప్రోత్సహించి వ్రాయుమనుటచే, సత్యనారాయణమూర్తిని హృదయమున నిడుకొని ప్రార్థించుచు నీశతకమును నేటికిఁబూర్తిచేసి పండిత లోకమునఁ బెట్టినాడను.

నే నీశతకమును వ్రాయునపుడు చేదోడును వాదోడునై సకలవిధముల నాయుత్సాహమునకు భంగము గలుగకుండసహాయపడిన మ॥ఆ॥ శ్రీ వెంకటరమణయ్యగారుస్తుత్యర్హులు.

ఇదివఱకుఁ బ్రథమ ప్రయత్నమగుటచే నిందుఁ బ్రమాదము లెక్కుడు దొరలియుండును. చదువరులగు మత్సోదరు లందఱు నిందుఁగల తప్పుల నరయక హంసక్షీర న్యాయమున నొప్పులనే గ్రహించెదరుగాక ! యని నాకృతజ్ఞతావందనముల నర్పించుచున్నాడను.

స్వల్పప్రమాదము లున్నను నిదిభగవత్కృతి గావున దోషభూయిష్ఠము కాదని చిత్తమునకు సమాధానముచెప్పి యచ్చొత్తింప సాహసించినందుకుఁ బండితలోకము మన్నించునుగాక !

ఏలూరు
28—8—38

ఇట్లు సజ్జన విధేయుఁడు,
సబ్బవరపు చినవెంకటాచార్యులు,
శతకకర్త.

సోదర సోదరీమణులారా!

ఈశతకమును రచించిన బ్ర॥శ్రీ॥ సబ్బవరపు చినవెంక టాచార్యులుగారు మనకందరకును మహోపకారమును జేసిరి. అదెట్లనిన? సులభశైలిని ఆబాలవృద్ధులకును పద్యము చదివిన వెంటనే అర్థమయ్యేటట్లుగా వ్రాయుటయేగాక సత్యనారాయణుని వ్రతవిధానము శతనామోచ్చాటన మొదలైన పూజావిధానములు ఇందుపొందుపరచి తద్వ్రత ఫలితమైన కథలను ఈశతకమునందే 62 వ పద్యమునుండి శతకాంతము వఱకు తత్కథలకు సంబంధించిన పద్యములుగా రచించుటచే శతకముగా చదువుటకును వ్రతమున కుపయుక్తముగనుండుటం జేసి యెంతయు నుపయోగకరమనుట ఆశ్చర్యమంయిన విషయముకాదు. (మఱియు) ఈశతకమును, కులకవి పోషకాది బిరుదాంకితులకు బ్ర॥ అలుగోలు గంగరాజాచార్యులుగారు శతకకర్తచేత ఈశతకమును,చదివించి యిదియచ్చొత్తించినచో లోకోపయుక్తముగా నుండునని తలంచిరో, మఱియే కారణముచేతనైనను దీనిని తమద్రవ్యమును వెచ్చించి యచ్చొత్తించి మనందరి కరములందలంకరింపజేసినందులకు నాకృతజ్ఞతా పూర్వకవందనము లర్పించు చున్నాడను.

బ్ర॥శ్రీ॥ గంగరాజాచార్యులుగారు యీ శతకమును అచ్చొత్తింపుజేసెననుట కాశ్చర్యమేమి?

సీ॥ పేదలఁబాడగని ♦ ప్రీతివృత్తులఁజూపి
మహీఁ చరించెడు బుద్ధి ♦ మంతుఁడెవ్వఁ
డల కులవర్ధనుం ♦ డనుచు పండితులచే
దీవనల్ వడసిన ♦ దిట్టయెవ్వఁ
డిలను తెనాలి పం ♦ డిత సభం గులకవి
పోషక బిరుదును ♦ బొందెనెవ్వఁ
డెపుడు సత్కథలను ♦ నెలమితోఁ గావించి
యానందమగ్నుఁడౌ ♦ నాతఁ డెవ్వఁ

గీ॥ డిపుడు సత్యనారాయణుఁ ♦ డింపుమీఱఁ
గోరి యెవ్వాని చెంతకుఁ ♦ జేరెఁ బద్య
రూపకంబుతో నతఁడు తద్ ♦ రూపకమున
గారమున నిన్నుఁ బ్రోచుత ♦ గంగరాజ!

ఇట్లు,
గొట్టాల లక్ష్మయ్య.

# గురుస్తుతి.

క. శ్రీ కొత్తపల్లి వంశసు
ధాకరునిం గవినిఁ బాడితాగ్రిణి సుజనుం
బ్రాకట భక్తినిమద్గురుఁ
జేకొని భజియింతు నిష్టసిద్ధికివరుసన్. 1

క. శ్రీగరుడ గర్వభంగము
బాగుగరచియించెఁ బెక్కుభావములలరన్
భోగిశయను చారిత్రము
బాగని సత్కవులు మేటి పండితులనఁగన్. 2

సీ. తనదీవనల శిష్యజనములనెల్లర
సత్కవీశ్వరులఁగాఁ జలుపు మేటి
యక్షరంబెఱుఁగని యట్టి మూఢులనైనఁ
జదువరులను జేయఁ జాలు గురువు,
అరయ శ్రీలక్ష్మ వరాస్థాన విద్వాంసుఁ
డై సద్యశంబాదినట్టి సుకవి
మంత్రిప్రెగడ వంశమణి శ్రీభుజంగభూ
పాలునాస్థానసత్పండితుండు ;
గీ. అవని శ్రీకొత్తపల్లి వంశాబ్ధిభాను
జ్ఞాని సుందర రామయ్య నామధేయు
సత్కవీంద్రుని .బండితసార్వభౌము
మద్గురు భజింతునెపుడు నామానసమున. 3

శతకకర్త.

# కృతిసమర్పణము.

ఏ మహాతేజశ్శాలి నారదమహామునికి, సత్యనారాయణ వ్రతవిధానము నెఱింగించెనో, యట్టి యవతారపురుషుండగు నంబుజనాభున కీశతకమును గృతినిచ్చుచున్నాడను

క. కందములు నేర్చుగతినా
నందముగా నీదుపేరునం గృతిగా నీ
గ్రంథము నర్పించితినే
సందియమును లేక గొనుము సత్యరమేశా !

కందపద్యమున "సత్యనారాయణా" అనునది యెందును నిముడని కారణమున "సత్యరమేశా" అను మకుటము పెట్టితిని; సత్యశబ్దమునకు, నారాయణ శబ్దమును గలిపినను, రమేశ శబ్దమును గలిపినను నేకార్థమునిచ్చునదియేగాన,బుధవరులు సత్యనారాయణా ! యనిన నెంతో, సత్యరమేశా ! యనినను నంతియేయని తలంతురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు భక్తుండు,

సబ్బవరపు చినవేంకటాచార్యులు.

శ్రీ ర స్తు.

# శ్రీ సత్యనారాయణ వ్రత ప్రారంభః.



## గ ణ ప తి పూ జ.

ఆచమ్య-శుభతిథౌ శోభనే ముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్ర సౌరమానేన ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే సంవత్సరే అయనే మాసే పక్షే వాసరే ఏవం శుభనక్షత్రశుభయోగ శుభకరణాద్యనేక గుణవిశిష్టాయాం శుభతిథౌ మమ ధర్మార్థకామ మోక్షచతుర్విధఫలపురుషార్థ సిద్ధ్యర్థం పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం సత్యనారాయణముద్దిశ్య సత్యనారాయణదేవతా ప్రీత్యర్థ్యా సత్యనారాయణపూజాం గత్వేన గణపతిపూజాం కరిష్యే॥

గణానాంత్వా గణపతిగ్ం ప్రార్థయా మహేకవిం కవీనా ముపమశ్రవస్తమం జ్యేష్ఠరాజం బ్రహ్మణస్మృత ఆన

శ్రుణ్వన్ సూరిభిస్సీరసాధనమ్॥ గణాధిపతియేనమః ధ్యాయామి ఆవాహయామి ఆసనం అర్ఘ్యం ఆచమనీయం మధుపర్కం స్నానంవస్త్రం యజ్ఞోపవీతం గంధంఅక్షతాన్ పుష్పాణిసమర్ప యామి. సుముఖాయనమః ఏకదంతాయనమః కపిలాయనమః గజకర్ణికాయనమః లంబోదరాయనమః వికటాయనమః విఘ్న రాజాయనమః గణాధిపాయనమః ధూమకేతవేనమః గణాధ్య క్షాయనమః ఫాలచంద్రాయనమః వక్రతుండాయనమః శూర్పకర్ణాయనమః హేరాంబాయనమః స్కందపూర్వజాయ నమః శ్రీగణాధిపతయేనమః ధూపదీప నైవేద్యాది సర్వోప చారపూజామ్ సమర్పయామి.

ఆచమ్య............ఏవం గుణ.........శుభతిథౌ శ్రీమాన్......గోత్ర......నామధేయః, శ్రీమతః...... గోత్రోద్భవస్య...... నామధేయస్య (మమ) ధర్మపత్నీ సమేతస్య మమోపాత్తాదురిత క్షయద్వారా శ్రీలక్ష్మీనారా యణ ప్రీత్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధఫలపురుషార్థ సిద్ధ్యర్థం మనోభీష్ట సకల సంపత్సమృద్ధ్యర్థం శ్రీలక్ష్మీసమేత సత్యనారాయణపూజాం ధూపదీపనైవేద్యాది సర్వోపచార పూజాం సమర్పయామి, గణపతి ముద్వాసయామి॥

## అథనవగ్రహపూజా.

ఆకృష్ణేన రజసావర్తమానో నివేశయ న్నమృతం మర్త్యంచ హిరణ్మయేనసవితారాథేనాదేవోయాతి భువనాని

పస్యన్॥౧॥సూర్యాయనమః ఆవాహయామి ఆసనం సమర్పయామి అర్ఘ్యం సమర్పయామి వస్త్రం యజ్ఞోపవీతంగంధం అక్షతాన్ పుష్పాణిసమర్పయామి ధూపదీపనైవేద్యాదిసర్వోపచారపూజాం సమర్పయామిఏవంసర్వత్ర ఇమం దేవా ఆసపత్నగ్ంసు పథ్యమహతేక్షు త్రియమహతే జ్యేష్ఠాయమహతే జ్యానరాజ్యాయేంద్ర స్యేంద్రియాయఇమమముష్యపుత్రమముష్య పుత్రమస్యై విశఏషవోమ్మి రాజా సోమోస్మాకం బ్రాహ్మణానాగ్ంరాజా॥౨॥ చంద్రాయనమః ఆవాహనాది సర్వోపచారపూజాం సమర్పయామి॥ అగ్నిర్మూర్ధాదివః కకుప్పతిః పృథివ్యాఅయమ్ అపాగ్ంరేతాగ్ంసిజిన్వతి॥౩॥ భౌమాయనమః॥ఆవాహనాది సర్వోపచార పూజాంసమర్పయామి॥ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహిత్వమిష్టాపూర్తేసగ్ం సృజేయంచ అస్మిన్ అధస్తే అధ్యుత్తరస్మి విశ్వేదేవాయజమానశ్చ సేదత్త॥౪॥ బుధాయనమః ఆవాహనాది సర్వోపచార పూజాం సమర్పయామి॥ బృహస్పతే అతియదర్యో అర్హాద్యు మద్విభాతి క్రతుమజ్జనేషుయద్ద్విధయశ్చవసబుతుప్రజాపదదస్మాసు ద్రవిణం దేహిచిత్రం॥౫॥ బృహస్పతయేనమః॥ ఆవాహనాది సర్వోపచారపూజాం సమర్పయామి॥ అన్నాత్పరి స్రుతోరసం బ్రహ్మణావ్యపిదత్ క్షత్రం పయః॥౬॥ శుక్రాయనమః॥ఆవాహనాది సర్వోపచారపూజాం సమర్పయామి॥శన్నో దేవీఅభీష్టయః ఆపోభవంతు పీతయేశంభో రభిస్రవంతునః॥౭॥ శనైశ్చరా

యనమః॥ ఆవాహనాదిసర్వోపచార పూజాం సమర్పయామి॥ కేయాసచ్చిత ఆభువ దూతీసదా వృధస్సుఖాకయాశచీశచీష్ట యావృతా॥౮॥రాహవేనమః॥ఆవాహనాదిసర్వోపచార పూజాం సమర్పయామి॥ కేతుం కృణ్వన్నా కేతవే పేశో మర్యాఅపే శశి సుముఖద్భిరజాయథా ॥ కేతవేనమః ॥ ఆవాహనాది సర్వోపచారపూజాం సమర్పయామి ॥ బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తా ద్విసీమత స్సురుచోవేనఆవం ॥ సబుధ్న్యా ఉప మా అస్య విష్టాఃశరశ్చయో విమసతశ్చవిః॥ బ్రహ్మణేనమః ఆవాహనాది సర్వోపచార పూజాం సమర్పయామి॥ విష్ణో లలాటమసివిష్ణోశ్నప్రె స్థోవిష్ణోః స్యూరసివిష్ణోర్ధ్రువోసి వైష్ణవా నామసివిష్ణావేత్వావిష్ణవేనమః॥ ఆవాహనాది సర్వోపచార పూజాం సమర్పయామి॥ నమశ్శంభవాయచ శివతరాయచ॥ శివాయనమః॥ ఆవాహనాది సర్వోపచార పూజాం సమర్పయామి॥ శ్రీశ్చతేలక్ష్మీశ్చపత్న్యావహోరాత్రేపార్శ్వేనక్షత్రాణి రూపమశ్వినౌవ్యాత్తం । ఇష్టన్నిషాణా ముమ్మాయిషాణ సర్వలోకం మయిషాణ॥ లక్ష్మైనమః॥ ఆవాహనాది సర్వోపచార పూజాం సమర్పయామి॥



## అ థ స త్య నా రా య ణ పూ జా వి ధిః.

ప్రతీసంక్రాంతౌ పౌర్ణమాస్యాంచైకాదశ్యాంయస్మిన్ తస్మిన్ దినేవాసాయం కాలేస్నానం కృత్వాపూజాస్థాన మాగత్యాసనే వుపవిశ్యాచమ్యపవిత్రధారణంకృత్వా గణేశ గౌరీవరుణదేవతానాం ప్రతిష్ఠావాహనం కృత్వా సంకల్పం కుర్యాత్ ॥ ఏవంగుణతిథౌ గోత్రో ముకశర్మా సకలదురితో పశమన సర్వాపచ్ఛాంతిపూర్వక సకలమనోరథ సిద్ధ్యర్థం యథాసంపాదిత సామగ్ర్యాగణేశ గౌరీవరుణదేవతా గణపత్యాది పంచలోకపాలదేవతా సూర్యాదినవగ్రహదేవతా పూజాన పూర్వకం పూర్వాంగీకృత శ్రీ సత్యనారాయణ పూజన కథాశ్రవణమహం కరిష్యే ॥ గణేశాదిభ్యోనమః ఆవాహనాస నార్ఘ్యాద్యాచమనీయ స్నానగంధాక్షత పుష్ప ధూపదీప నైవేద్యాచమనీయ ముఖవాస తాంబూలపూగీఫలద్రవ్యాణి త త్తన్మంత్రైస్సమర్పయామి ॥ ఏవం సూర్యాదిగ్రహాణాం త త్తన్మంత్రైః పూజాంకుర్యాత్ అథ సత్యనారాయణ పూజాప్రకారమాహ పుష్పగృహీత్వాధ్యానం కుర్యాత్ ॥ ధ్యాయేత్సత్యం గుణాతీతం గుణత్రయసమన్వితం॥ లోక

నాథంత్రిలోకేశం కౌస్తుభాభరణం హరిం ॥ నీలవర్ణం పీత వాసం శ్రీ వత్సపదభూషితం । గోవింద గోకులానందం బ్రహ్మా ద్యైరపిపూజితమ్ । ఇతిధ్యానం వ్యక్తావ్యక్త స్వరూపాయ హృషీకపతయేనమః। మయానివేదితో భక్త్యాఅర్ఘ్యోయం ప్రతి గృహ్యతామ్ ఇత్యర్ఘ్యం సమర్పయామి ॥ నారాయణ నమ స్తేస్తు నరకార్ణవ తారక । పాద్యం గృహాణదేవేశ మమ సౌఖ్యం వివర్ధయ ॥౪॥ ఇతిపాద్యం సమర్పయామి ॥ మన్దాకి న్యాస్తుయద్వారి సర్వపాపహరం శుభం । తదిదంకల్పితందేవ సమ్యగా చమ్యతాంత్వయా ॥౫॥ ఇత్యాచమనీయం సమర్ప యామి॥ స్నానంపంచామృతైర్దేవగృహాణే పురుషోత్తమ । అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణే ప్రణతిప్రియ ॥౬॥ ఇతి స్నానం సమర్పయామి॥ వేదసూక్త సమాయుక్తేయజ్ఞ సామసమన్వితే సర్వవర్ణ ప్రదేదేవ వాసనప్రతిగృహ్యతామ్ ॥౭॥ ఇతివస్త్రం సమర్పయామి॥ బ్రహ్మావిష్ణుమహేశేన నిర్మితం బ్రహ్మసూత్రి కం । యజ్ఞోపవీతదానేనప్రియతాం కమలాపతిః ॥౮॥ ఇతి యజ్ఞోపవీతం సమర్పయామి ॥ శ్రీఖండచందనందివ్యం గంధా ఢ్యం సుమనోహరం । విలేపనం సురశ్రేష్ఠచందన ప్రతిగృహ్యా తాం ॥౯॥ ఇతిచన్దనం సమర్పయామి॥ మల్లికాది సుగంధినీ మాలత్యాదీనివైప్రభో । మయాహృతాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యతాం॥ పుష్పాణిసమర్పయామి ॥ అథాంగపూజా॥ నారాయణాయనమః-పాదౌపూజయామి ॥ శేషశాయినేనమః

గుల్ఫౌ। కాలస్వరూపిణేనమః-జంఘే ॥ విశ్వరూపాయనమః-జానుం। జగన్నాధా యనమః గుహ్యం॥ కమలనాభాయనమః-నాభిం. జగత్కుక్షినేనమః-కుక్షిం ॥ లక్ష్మీవిలసద్వక్షనేనమః వక్షస్థలం॥చక్రాదిహస్తాయనమః-హస్తాన్॥ చతుర్బాహ వేనమః బాహూ॥ శ్రీకంఠాయనమః- కంఠం॥ చంద్రముఖాయనమః-ముఖం॥సత్యవాచేనమః-వక్త్రం-శ్రీశాయనమః-నాసికాం॥ రవీందులోచనాయనమః- నేత్రే ॥ దిక్ఛ్రోత్రాయనమః- శ్రోత్రే॥ సర్వవ్యాపినేనమః - శిరఃపూజయామి ॥ శ్రీసత్యనారాయణస్వామినేనమః సర్వాంగాని పూజయామి॥

ఇ ం దు కు కా వ ల సి న వ స్తు వు లు.

| | |
|---|---|
| పసుపు | అరటిఫలములు |
| కుంకుమ | పుష్పములు |
| తమలపాకులు | కలశమునకు చెంబు ౧ |
| పోకలు | హారతికర్పూరము |
| ఖర్జూరకాయలు | సత్యనారాయణప్రతిమ ౧ |
| ఏలాగ్రాలు | కొబ్బరికాయలు |
| సాంబ్రాణి | మంటపారాధనకు చాపు |
| ఆవునెయ్యి | రవిక ౧ |
| పంచదార | బియ్యము |
| పటికబెల్లం | పంచామృతములు |
| గోధుమనూక | మామిడిమండలు |

## అథాష్టోత్తర శతనామ పూజా.

ఓం శ్రీకృష్ణాయనమః
కమలనాథాయ
వాసుదేవాయ
సనాతనాయ
వసుదేవాత్మజాయనమః
పుణ్యాయ
లీలామానుషవిగ్రహాయ
శ్రీవత్స కౌస్తుభధరాయ
యశోదావత్సలాయనమః
హరయే
చతుర్భుజాత్తచక్రాసి
గదాశంఖాద్యాయుధాయ
దేవకీనందనాయ
శ్రీశాయ
నందగోప ప్రియాత్మజాయ
యమునావేగ సంహారిణే
బలభద్రప్రియానుజాయ
పూతనాజీవహరాయ
శకటాసుర భంజనాయ
నందవ్రజ జనానందినే
సచ్చిదానంద విగ్రహాయ
నవనీత నవాహారాయ
ముచికుంద ప్రసాదకాయ

ఓంషోడశ స్త్రీసహస్రేశాయ
త్రిభంగినే
మధురాకృతయే
శుకవాగమృతాబ్ధీందవే
గోవిందాయ
యోగినాంపతయే
వత్సవాటీచరాయ
అనంతాయ
ధేనుకాసురభంజనాయ
తృణీకృతతృణావర్తాయ
యమళార్జున భంజనాయ
ఉత్తాలతాలభేత్రే
తమాలశ్యామలాకృతయే
గోపగోపీశ్వరాయ
యోగినే
కోటిసూర్యసమ
ప్రభాయ, ఇళాపతయే
పరంజ్యోతిషే
యాదవేంద్రాయనమః
యదూద్వహాయ
వనమాలినే, పీతవాసనే
పారిజాతాపహారాయ
గోవర్థనాచలోద్ధర్త్రే

ఓం గోపాలాయ
సర్వపాలకాయ
అజాయ
నిరంజనాయ
కామజనకాయ
నవనీత విలిప్తాంగాయ
నవనీతనటాయ
అనఘాయ
కంజలోచనాయ
మధుఘ్నే
మథురానాథాయ
ద్వారకానాథాయ
ద్వారకానాయకాయ
బలినే
బృందావనాంతసంచారిణే
తులసీదామభూషణాయ
శ్యమంతకమణేర్హర్త్రే
నరనారాయణాత్మకాయ
కుబ్జాకృష్ణాంబరధరాయ
మాయినే
పరమపురుషాయ
ముష్టికాసురచాణూర
మల్లయుద్ధ విశారదాయ
భవహారాయ

కంసారయే
మురారయే
నరకాంతకాయ
అనాదిబ్రహ్మచారిణే నమః
కృష్ణావ్యసనకర్శనాయ
శిశుపాలశిరశ్ఛేత్రే
దుర్యోధన కులాంతకాయ
విదురాక్రూరవరదాయ
విశ్వరూపప్రదర్శకాయ
సత్యవాచే
సత్యసంకల్పాయ
సత్యభామారతాయ
జయనే
సుభద్రాపూర్వజాయ
విష్ణవే
భీష్మముక్తిప్రదాయకాయ
జగద్గురవే
జగన్నాథాయ
వేణునాదవిశారదాయ
వృషభాసురవిధ్వంసినే
బాణాసురకరాంతకాయ
యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే
బర్హిబర్హావతంసకాయ
పార్థసారథయే నమః

అవ్యక్త గీతామృత
మహోదరాయ
కాళీయఫణిమాణిక్యరంజిత
శ్రీ పదాంబుజాయ
దామోదరాయ
యజ్ఞభోక్త్రే
దానవేంద్రవినాశకాయ
నారాయణాయ
పరబ్రహ్మణే
పన్నగాశనవాహనాయ

జలక్రీడాసమాసక్త గోపీ
వస్త్రాపహారాయ
పుణ్యశ్లోకాయ
తీర్థపాదాయ
వేదవేద్యాయ
దయానిధయే
సర్వదేవాత్మకాయ
సర్వగ్రహరూపిణే
పరాత్పరాయ

యథాశక్తికి శోభనద్రవ్యములన్నియు జాగ్రత్త పర్చవలయును. పురోహితుని శక్తికొలది సంతోషపర్చవలయును. వ్రతకథను జెప్పువారికి నూతనవస్త్రాభరణములు సమర్పించుట శ్రేయోభివృద్ధియనఁబడును.

# ఆశీర్వాదము.

ఉ॥ ఎవ్వనిభక్తిచేఁ గొలువనెల్ల శుభంబులుగల్గుచుండునిం
కెవ్వనిచిత్ర సన్నుటనలెల్ల సదాపఠియించి మించివే
రెవ్వని జేరె పద్యముల నింపుగఁ గూరిచియంకితంబు దా
రెవ్వనికిత్తురా హారి సిరిచ్చుతపేర్మిని గంగరాజుకున్.

ఉ. ఒక్కనికిచ్చెచక్రము మరొక్కనికిచ్చెను వేదముల్ కృపన్;
ఒక్కనికిచ్చె శూలము మఱొక్కనికిచ్చెను శ్వేతకుంజరం
బొక్కనికిచ్చె ద్రవ్యమును నొక్కనికిచ్చె పరశ్వధంబు నా
రిక్కలరేని తాలుపిను నెక్కొన సపంద గంగరాజుకున్.

ఉ॥ కులమునువంశమున్ గుణము గూరిమి పెద్దలజేరుబుద్ధియున్
పలుకులనేరుపున్ యశముభక్తిని పండిత పంక్తిఁ గూడుటల్
కులకవిపోషకుండనుచు గొన్నసుకీర్తిని పెంపుజేసియీ
యిలనుచిరాయులిచ్చివిధి యెంతయుబ్రోచుత గంగరాజునున్.

ఇట్లు ఆశీర్వదించు విధేయుడు,

గ్రంథకర్త.

శ్రీ.

# సత్యరమేశ శతకము.





రమణీ హృదయేశ్వర !
సారసలోచన పురారి ! సన్నుతచరణా
నోరారఁగ నీనామము
సారెకుస్మరియింతుఁబ్రోవు సత్యరమేశా ! 1

క. కరిరాజువేఁడెనిన్నును
మురహర నేనునుదలంతు మోక్షముఁగూర్పన్
దురితహరనీవెధర; నీ
సరిదైవము గలదెచూడ సత్యరమేశా ! 2

క. మాటల కొఱకును బలుకుల
బోటిని బ్రార్థింపఁబోను పూర్ణప్రజ్ఞన్
మేటినిగఁ జేయనీతో
సాటియెవరు లేరు ధాత్రి సత్యరమేశా ! 3

క. మతిఁదెనుఁగు పదమెఱుఁగ సం
స్కృతిమెఱుఁగను నీశతమ్ముఁ జేసినిను స
న్నుతిజేయఁ బూనినాఁడను
శతకపుభారంబునీదె సత్యరమేశా ! 4

క. వ్యాకరణ మెఱుఁగనీపై
నాకుంగల భక్తిభావనల గ్రంథమునన్
వాకొనెద నీస్తవంబును
సాకల్యముగాఁగనదుపు సత్యరమేశా ! 5

క. దీపంబులేక చీఁకటి
లోపలఁగల వస్తువులను లోలతఁజూడం
దోపవుగద ! యజ్ఞుఁడనేఁ
జాపల్యత నినుఁగనెదన సత్యరమేశా ! 6

క. తెలివియను దీపమొక్కటి
వెలిఁగింపుము నాదుహృదయ వీధినినినునేఁ
దెలిసికొని పూజసేతును
సలలిత భక్తిప్రపత్తి సత్యరమేశా ! 7

క. దళమాయఁజాలఁ బుష్పం
బులనొసఁగం జాలనుఫలముల నొసఁగంగాఁ
గలవాఁడఁగాను దేవా !
జలమేనియు నీయఁజాల సత్యరమేశా ! 8

క. భక్తుండనియెడి పేర్మిడి
వ్యక్తము గావించి దీనవత్సల నన్నున్
శక్తిగలవాని గానా
సక్తిని బోనరింపుమయ్య సత్యరమేశా! 9

క. ధనమడుగ వస్తువుల వా
హనములనే నడుగ భోగమడుగను రాజ్యం
బును నడుగనిన్ను నేయా
చన జేసెదముక్తియొక్కటె సత్యరమేశా ! 01

క. చుట్టములుగారు సాయము
పెట్టరుబంధువులుతోడు పృథివీస్థలిలో
గట్టిగఁబడ రాపులు నీ
చట్టమ్మాధారమగును సత్యరమేశా ! 11

క. తప మొనరింపఁగ నాకడ
నిపుణతయొక్కింత లేదు నేయాత్రలునున్
విపులముగఁ జేయఁజాలను
జపియింతును మదినినిన్ను సత్యరమేశా ! 12

క. నడుచునెడ, నిలుచునెడలం
గుడుచునెడలఁ గూర్కునెడలఁ గ్రోలునెడలన
ప్పుడు పనులుసేయు నెడలన్
సడలదు నీనామచింత సత్యరమేశా ! 13

క. పసిబాలకుండు పుత్రుఁడు
దోసఁగులు మాటాడువాని దోసంబులుగాఁ
బస నెంచని గురువలె వి
శ్వసనము నామీఁదఁజూపు సత్యరమేశా ! 14

క. ఘనశాస్త్రము లెఱుఁగని మూ
ఢునకును మోక్షంబునుంగడుం గూర్తువు నీ
వనినిన్ను సంస్మరించెద
జనకా ! ననుబ్రోవుమిపుడు సత్యరమేశా ! 15

క. వేదములు దెలియనేరని
నీదివ్యమహాత్మ్య మెఱుఁగ నేనెటనల ప
ర్ణాదు లెటమూఢభక్తుఁడ
సాదరమున నన్ను బ్రోవు సత్యరమేశా ! 16

క. వ్రతములలోపలసిద్ధ
వ్రతముభవద్వ్రతముగాన భక్తిదలిర్పఁ
క్షితినేను జేయఁబూనితి
సతతమునను బ్రోవుమయ్య సత్యరమేశా ! 17

క. హరిభజనకన్న మిక్కిలి
వరమగుభజనమ్ము లేదు వసుధాస్థలి శ్రీ
హరివాసుదేవ ! కేశవ !
సరసీరుహనేత్ర ! శౌరి సత్యరమేశా ! 18

క. నారాయణ ! దామోదర !
నీరదసమదేహ ! ధారుణీవర ! హరి ! దై
త్యారి ! జనార్దన ! గరుడ
స్ఫారధ్వజ ! చక్రపాణి ! సత్యరమేశా ! 19

క. దేవాదిదేవ ! యచ్యుత !
గోవింద! మురారి ! శార్ఙ్గి ! గోపాల ! యుపేం
ద్రా ! విష్ణు ! వరహృషీ కే
శా ! వైకుంఠ ! నరసింహా ! సత్యరమేశా ! 20

క. వామన ! కేశవ ! మధురిపు !
సోమాదిత్యాంబకా ! విశుద్ధచరిత నీ
నామజపము విడిచినయొక
జాముయుగంబగును నాకు సత్యరమేశా ! 21

క. భవబంధము లెడలింపుము
దవిలిభవత్సేవ సంతసంబునొనర్తున్
వివిధాఘనాశ ! నా కు
త్సవమయ్యెడు నిను నుతింప సత్యరమేశా! 22

క. నారాయణ ! కరుణానిధి
నారాయణ పుండరీకనయన ! మధురిపూ !
నారాయణ నినునమ్మితి
సారక్షీరాబ్ధిశయన ! సత్యగమేశా ! 23

క. ఒకసారినీదు నామము
ప్రకటముగాఁ దలఁచిరేనిఁ బాపములెల్లన్
వికలములై పోవుననుచు
సకలజ్ఞా నినుదలంతు సత్యరమేశా ! 24

క. వందనమో ! విశ్వంభర !
వందనమో దివిజమౌని వందితచరణా
కందర్ప కోటిసుందర
సందియమా నన్నుఁ బ్రోవ సత్యరమేశా ! 25

క. హరిహరిహరిహరి యనుచును
గరిమను మొరవెట్టవేడ్కఁగాపాడితి వే
మఱి సాటియెవరు నీకిల
శరధిశయన వేల్పులందు సత్యరమేశా ! 26

క. దిక్కెవ్వరయ్య ధ్రువునకు
దిక్కెవరు సుభద్రకెన్న దీనులకెల్లన్
దిక్కెవ్వరయ్య నాకును
సక్కూబాయికిని నీవ సత్యరమేశా ! 27

క. నిన్నుద్రి విక్రమయనుచును
మన్ననతోఁ గొల్చుచుందు మాధ ! వస్వామీ !
పన్నగశయనా ! కడునిను
సన్నుతి గావింతునయ్య సత్యరమేశా ! 28

క. నిను వాసుదేవయనుచును
మునులెల్లరుఁ గొల్చుచుంద్రు మోక్షమునకునే
నునునట్లె కొల్చెదనుహరి
సనకాది మునీంద్రవినుత సత్యరమేశా! 29

క. శతకోటి భానుతేజా !
యతులిత మహిమావిశేష యంబుజనాభా !
వ్రతములు సల్పుచుఁ బాడుచు
సతతము సేవించుచుంటి సత్యరమేశా ! 30

క. వనజాక్ష ! భక్తవత్సల
మనముననిను వేఁడుచుండు మానకసతమున్
మునివినుత కావనను వం
చన సేయుటపాడిగాదు సత్యరమేశా ! 31

క. ఓ పద్మనాభ ! మాధవ !
కాపాడుమునీలదేహా ! కరుణానిధివై
పాపంబులఁ బాపుముశివ
చాపవిఖండన పటిష్ఠ సత్యరమేశా ! 32

క. సంకర్షణా ! జనార్దన !
సంకోచముమానినిన్ను సమ్మతిఁగొలుతుం
బంకము నాపైనేటికి
శంకరనుత కృపనుజూడు సత్యరమేశా ! 33

క. పరిపరి విధములనినునేఁ
బరమాత్మ ! భజంతుసతముఁ బంకజనాభా !
మఱియెవరు నాకునీయిల
సరసీరుహనయనకావు సత్యరమేశా ! 34

క. మగమీనమ వైజలనిధిఁ
బగతుని సోమకునిజంపి వనజభవునకున్
నిగమములు దెచ్చియీయవె
జగదేకశరణ్యదయను సత్యరమేశా ! 35

క. దామోదర పరమేశ్వర !
వేమరునిను దలఁతునయ్య విశ్వమునందున్
వామనతన్ బలిఁద్రొక్కిన
స్వామిని కృపఁజూడుమయ్య సత్యరమేశా ! 36

క. మతముల నెన్నఁడు నెన్నకు
సతతము నీవ్రతముఁజేతు సత్యముజక్కీ
పతినిన్ను దలఁచువారికి
శతమఖ పుణ్యములభించు సత్యరమేశా ! 37

క. నీదివ్యరూపుఁజూపుము
నాదగు దుష్కృతములెల్ల నశియింపంగా
మేదిని సేయుమునిన్నవి
పాదమ్ములఁ దోలఁచుమయ్య సత్యరమేశా ! 38

క. పంతమ నాతోహరి ! నే
నెంతటివాఁడను కృపాళు ! యేమిరనే నీ
చెంతను జేరితిఁ బ్రోవర
సంతత మునిలోలదేవ సత్యరమేశా ! 39

క. ఎన్నివిధంబులఁ బిలిచినఁ
గన్నెత్తి కనంగరావు కటకటకుక ని
న్నెన్నఁడు విడుతను నిర్జర
సన్నుత నరహరినిజంబు సత్యరమేశా! 40

క. పొగడితిని సభలనిన్నే
బొగడితి ప్రహ్లాదవినుత భూరిభజనలం
బొగడితిని శబరినేలిన
జగదేక ప్రభుఁడవనుచు సత్యరమేశా! 41

క. ఏటికిఁ బలుమాటలు నీ
సాటియయిన వేల్పులేడు క్షమననిగడపైఁ
చాటగ దాండదదాండని
చాటెద గజరాజునెక్కి సత్యరమేశా! 42

క. సుతులనుచు భార్యయనుచును
హితులని బాంధవులటందు రెంతయుమనుజుల్
కుతుకమున నీదుపదములు
సతతము భజింపరౌర! సత్యరమేశా! 43

క. పుట్టుచుఁ బెరుగుచునంతనె
పెట్టిరనగ లెన్నొప్రేమ వెలయఁగమేనుగ
గిట్టిన దినమున వేరులునఁ
జట్టననొక చుట్టునిడరు సత్యరమేశా! 44

క. కనఁబడితివందు ధ్రువునకుఁ
గనఁబడితివటందు మౌనిగణములకెల్లం
గనఁబడఁగ రాదెనాకును
సనకసనందన సువినుత సత్యరమేశా ! 45

క. గోపాల కృష్ణదేవా !
కాపాడుమునన్ను వేగఁ గరుణానిధి ని
న్నే ప్రొద్దు వేఁడు చుంటిని
శ్రీపతి ! నా హృదయమందు సత్యరమేశా ! 46

క. ధ్రువుపై నహల్యపైనిఁ
భువిపైనిని సురలపైని భూసురుపైనిఁ
రవిసుతునిపైని జూపిన
నవిరళకృపఁజూడునన్ను సత్యరమేశా 47

క. సత్యుఁడవు నీవటంచును
బ్రత్యక్షముగన్నటంచుఁ బ్రార్థింపసురల్
ప్రత్యక్షమగుచుఁ బ్రోవలె
సత్యజనపాలనాథ ! సత్యరమేశా ! 48

క. కన్నులను మూసితిరిగెడి
దున్నలసిగఁబట్టి జముఁడు దుఃఖకవిడునే
యెన్నఁడునిను నేవిడువను
సన్నుతసద్గుణ విశాల ! సత్యరమేశా ! 49

క. పగనీగుడి కేగుటయున
వగకత్తెల యిండ్లకెట్లు పరువులిడెదరో
పగఁబట్టకున్న శమనుఁడు
జగతిని నమ్మూఢజనుల సత్యరమేశా ! 50

క. వడుగవయి దానబలి మూఁ
డడుగులు భువినడిగి వానినడఁచి సురలకుం
గడుణాలుఁ గూర్చినటనా
జడమతిఁ ద్రొక్కినను బ్రోవు సత్యరమేశా ! 51

క. హరినీనామం బెప్పుడు
స్మరియించెడి భక్తవరుల చరణరజము నా
శిరమున నిడుదుననియె భా
స్కరతనయుఁడు బ్రోవుమయ్య! సత్యరమేశా ! 52

క. తలిదండ్రులు సహజన్ములు
గలలోఁగాంచిన విధంబుగాదే చూడన్
సలిలంపు బుడగచెడదే
సలలిత కరుణార్ద్ర హృదయ ! సత్యరమేశా ! 53

క. పొగడిన వలువలనిచ్చితి
పొగడిన సిరులిచ్చితయ్య భూసురునకు నం
బొగడితినే సిరులకొఱకు
జగదుదరా ! నన్నుబ్రోవు సత్యరమేశా ! 54

క. రాజ్యములు గలుగఁగానవి
భోజ్యములగుఁ గాకభువ్రని బూజింతు్రనరుల్
రాజ్యములు పరమునిడునవి
షడ్జ్యోద్భవజంతురక్షా సత్యరమేశా! 55

క. ఆహా! కలికాలమహిమ
యాహా! మోహమునఁ జిక్కి యజ్ఞులుగాఁగా
నాహా! మరచినవారికి
సహాయ్యంబెట్టులాదు సత్యరమేశా! 66

క. సంసారంబను నబ్ధిని
కంసాంతక నన్నుముంచి ఖలుఁడని విడువన్
సంసారివీవు నన్మని
సంసేవ్యా! నన్నుఁబ్రోవు సత్యరమేశా! 57

క. కుడువక భిక్షమిడకకడు
నడియాసను గూర్చునట్టి యర్థమకట! నీ
యెడగవ్వయు వెచ్చింపరు
జడమతులై ధాత్రిజనులు సత్యరమేశా! 58

క. శాశ్వతమా ధనమున్మతి
శాశ్వతమా దారసుతులు సహజన్ములునున్
శాశ్వతమ యీప్రపంచము
శాశ్వతఫల సుప్రసాద సత్యరమేశా! 59

క. సారెకునీనామంబును
నోరూరఁగఁబలుకు కొఱకెనోఁచ్చితినే
నోరెత్తి పాడెదనుహరి
సారెకు సా సరిగమనుచు సత్యరమేశా ! 60

క. యమునకునే జడువనుమఱి
కమలనయన కరుణానిధి కామితఫల దా
యమరఁగ నీనామంబును
సమయమిదె భజింతునయ్య సత్యరమేశా ! 61

—♦ ప్రథమాధ్యాయము ♦—

క. నారదునకీవు చెప్పిన
భూరివ్రత మహిమమౌని పుంగవులకు నా
పౌరాణికుండుజెప్పిన
సారవ్రతమేనుజేతు సత్యరమేశా ! 62

క. కలికల్మషమున మునిఁగిన
యిలజనముల ముక్తిఁజేర్ప నిచ్ఛగలిగి యి
మ్ముల దేవ మౌని చేతన్
సలలితముగ నీ వ్రతంబు సత్యరమేశా ! 63

క. ప్రకటంబుఁజేసిలోక
ప్రకరమునకు మేలుఁగూర్చి రాజిల్లెదు నీ

యకలంక మూర్తిఁగన్నుల
సకలసమాయములను గందు సత్యరమేశా ! 64

క. ఓసత్యదేవ ! నీ వ్రిత
మాసంగావించు వారలఖిలేప్సితముల్
వాసిగని సౌఖ్యపడెదరు
శాసనమిది తప్పదెపుడు సత్యరమేశా ! 65

క. మాఖమ్మునందొ మఖిమైవె
శాఖమ్మున యందొ యూర్జ సన్మాసమునం
దోఖలుఁడైన భవద్వ్రత
శాఖలుఁగొని వడిఁదరించు సత్యరమేశా! 66

క. ప్రతిమాసమందుగానీ
ప్రతివత్సరమందుఁగాని పౌర్ణమియందే
వితతైకాదశినాడో
చతురతనిను గొలువవలయు సత్యరమేశా ! 67

క. భూమిజన కష్టములుగన
నీమహిమ వ్రితము సేయ నిజముగఁబోవుం
బ్రేమను మున బోధివనేర్తువు
సామజవరదాసతంబు సత్యరమేశా! 68

క. నాలుగు వర్ణములజనుల్
స్త్రీలును నీ వ్రతము సేయఁ జెల్లుంగానన్

మేలుగని సౌఖ్య పడెదరు
చాలగఁ జైముక్తిదొరకు సత్యరమేశా ! 69

క. నీదు ప్రసాదంబునుగడు
మోదంబున స్వీకరించి ముక్తిఁగనరె దా
మోదర నీవ్రతమహిమము
సాదరమున వినిన శుభము సత్యరమేశా ! 70

—♦ ద్వితీయాధ్యాయము ♦—

క. మునువారణాసి పురిఁగల
ఘనదుఃఖతుఁడైన విప్రుఁగనివానికివృ
ద్ధునివలె నగపడితివిగద
జనకారక్షించుకొఱకె, సత్యరమేశా ! 71

క. అటువలె నగపడివేసి
పటుసువ్రత మహిమఁజెప్పి బాపఁడుజేయం
దిటముగ ధనంబునొసఁగి యా
చట దృశ్యముకావెతెలియ సత్యరమేశా! 72

క. ఆనాడు మొదలువిప్రుఁడు
పూనికప్రతిమాసమందు పూర్ణిమయందున్
మానకవ్రతములుఁ జేయుచు
జానొందఁగనిన్ను గనఁడె సత్యరమేశా! 73

క. అనియిట్టులు సూతమహా
మునినారదునకు హరిప్రమోదంబునఁ జె
ప్పిన సత్యదేవవ్రతమును
జనుఁడెవ్వఁడు జేసెననఁగ సత్యరమేశా! 74

క. అనియడుగ నిరాబారుల
కనియెందఱ్వ్రతముఁగాంచి కాపుకొలపువాఁ
డొనరింపఁ దలఁచినంతనె
చనువుగఁ లాభంబులీవె సత్యరమేశా! 75

క. కట్టెలవాఁడొక తటినీ
గట్టివ్రతము చూచిచేయఁ గరుణానిధివై
నెట్టనతనికి భాగ్యము
ఇట్టననీయంగ లేదె సత్యరమేశా! 76

## — తృ తీ యా ధ్యా య ము —

క. ధరనులాకాముఖుఁడను వర
వరుఁడు సతియుక్తుఁడై భవద్వ్రతమును బం
ధురరీతిఁజేసి పరమే
శ్వరసంతతి గాంచలేదె సత్యరమేశా! 77

క. అదిమొదలు నృపతిభక్తిని
వదలక ప్రతిమాసమందు వత్సరమందున్

ముదమునభవద్వ్రతమ్మును
సదమలమతిఁ జేయుఁడో కొ— సత్యరమేశా! 78

క. అటుజేయు వ్రతముఁగనికో
మటినటుల జేయఁగం బెంపలరన్ వేగన్
పటుతరమగు నీవ్రతమ
చ్చట భార్యకుఁ జెప్పఁడో కొ— సత్యరమేశా! 79

క. తనకుం బిడ్డలుగలిగిన
బూనరఁగ నీవ్రతముఁజేతు భువిననికలుగం
బూనరింతుఁ గూతుపెండిలి
జనములు గొండాడననుచు సత్యరమేశా! 80

క. తనయకుఁ బెండిలి జేసియు
నినుమరచుట జేసియావణిజుఁడనకిడవే
ఘనతర దుఃఖముఁ గనుమవి
క్షణమున శాపంబుఁగినుక సత్యరమేశా! 81

క. నీకోపంబునఁ జెరఁబడె
నాకోమటి యింటిలోని యర్థమువోయెం
బాొకట భవద్వ్రతమ్మును
సాకల్యముగాఁగనటను సత్యరమేశా! 82

క. వణిజుని తనయ కళావతి
నిను బాగడి వ్రతమ్ముసేయ నరిసెంచి పోన

ర్చినకతనగాదె పతియుఁ

జనకుడు జెరనుండివిడుట సత్యరమేశా! 83

—♦ చ తు ర్థా ధ్యా య ము ♦—

క. కోమటిచిత్తముఁ దెలియఁగ

భూమిని యతివోలె వాని పూర్ణధనంబుం

బ్రామికొని మరల నిచ్చితి

స్వామీ ! యాతండు బాగడ సత్యరమేశా! 84

క. ధనమిచ్చిన కోమటి నీ

ఘనసువ్రతమాచరింపఁగా సేవకునిం

దనయకు భార్యకుఁ జెప్పఁగ

జన ననుపడె యాతురతను సత్యరమేశా ! 85

క. చోరులు రాజధనంబును

కూరిమిగను తెచ్చి నెపము కోమటిపైనిం

జారులు బెట్టుట విడచుట

చారుఁడు వెలఁపంగ నపుడు సత్యరమేశా! 86

క. అల్ల కళావతి తనదగు

వల్లభుఁడు సముద్రమందుఁ బడిపోవుటకుం

బెల్లుగఁ జింతించిన నా

సల్లలితపు మహిమననుచు సత్యరమేశా ! 87

క. పలుకుచు నాదు ప్రసాదము
వెలయఁగ భక్షింపఁబోక విభుఁగాంచుటకుం
జెలఁగఁగఁ బోతివటంచును
సలలితముగఁ దెలుపలేదె సత్యరమేశా ! 88

క. ఆనాడు మొదలు వణిజుఁడు
పూనిక యొప్పారఁగఁ బ్రతి పూర్ణిమయందున్
ధ్యానించుచు నీ వ్రతమును
జానుగ నొనరిచి సుఖించె సత్యరమేశా ! 89

—♦ పంచమాధ్యాయము ♦—

క. తుంగధ్వజనరపతి నీ
మంగళపుఁ బ్రసాదమును క్షమన్విడుకతనన్
భంగపడె ధనసుతుల నీ
సంగతి నేగ్గాదె చూడ సత్యరమేశా ! 90

క. అదిగని రాజు మదిని దాఁ
బొదలుచు వనమందు నీకు భూరివ్రతమున్
ముదమెసఁగఁగని ప్రసాదము
సదమలమతిఁగొనఁడె వేగ సత్యరమేశా! 91

క. తనగృహముఁజేరి భూపతి
వినయమునన్ నీదు వ్రతము వేగమె జేయం

దనయులు సంపద గలుగదె
జనకా నీమహిమచేత సత్యరమేశా ! 92

క. ఆనాడు మొదలు మరువక
జానుగ ప్రతి వత్సరంబు జనులెల్లరిచే
మానక చేయించుచు భూ
జానియు నటు జేసియునఁడె సత్యరమేశా! 93

క. నీకథవిన్నను జదివిన
బాకటముగ నిస్స్వులైన భాగ్యముగలవా
రైకడు సుఖింతురి జగమున
సాకల్యముగాఁగ నెపుడు సత్యరమేశా ! 94

క. ధనహీనుఁడు ధనికుండగు
ననవరతముఁ భీతిఁగొన్న యాతఁడుభీతిం
గనకుండు నీ వ్రతంబును
జనునెవ్వఁడు గానిసేయ సత్యరమేశా! 95

క. రాముఁడు భార్యను బొందెను
భూమిసి మహిజిత్తుమంచి పుత్రులఁగాంచెన్
నేమమున దుష్టబుద్ధియు
స్వామీ; శ్రేయంబుఁజెందె సత్యరమేశా !

క. కావున నీవ్రతమెప్పుడు
భూవలయము నందుఁ జేయు పురుషులుఘన వి

ద్యావంతులు ధనవంతులు
జ్యావంతులు నగుదురెపుడు సత్యరమేశా ! 97

క. నారాయణ యనజాలను
నారాయణయనెడు నీదు నామాక్షరముల్
కూరిమి నానాలుకపై
శారదచే వ్రాయఁజేయు సత్యరమేశా ! 98

క. సత్యమ్మీశతకమ్మును
నిత్యము జదివినను విన్న నీదయకిలలోఁ
బ్రత్యక్ష భాజనములుగ
సత్యమ్ముగ నగుదురయ్య సత్యరమేశా ! 99

క. ధరణిని సబ్బవరపువర
గురుమూర్తికి నచ్చమాంబకు ద్వితీయంపుఁ
వరసుతుఁడను సింహాచల
సరసమతికి సోదరుండ సత్యరమేశా ! 100

క. చినవెంకట రత్నంబనఁ
దనరిన వాఁడన్నవచ్ఛతక కర్తను నా
వినుతులను గొనుచుఁబ్రోవం
జనునో దేవాదిదేవ సత్యరమేశా ! 101

పంచమాధ్యాయము సమాప్తి.

శ్రీ ర స్తు.

శ్రీ స త్య నా రా య ణా య న మః

# శ్రీ సత్యనారాయణ వ్రతసంబంధమయిన కథలు.

## క థా ప్రా రం భ ము.

ఒకానొక సమయమందు శౌనకాది మహామునులు నైమిశారణ్యంబునందుండెడి వ్యాస శిష్యుడును పురాణ ప్రవక్తయునగు సూత పౌరాణికుల నొకానొక ప్రశ్న జేసిరి. ఓ సూత పౌరాణికుడా! యీ యిలను పురుషునిచే కోరంబడు ఐహికపుత్ర పశ్వాది ఫలంబులు స్వర్గాద్యాముష్మిక ఫలంబులు వ్రతాదులు లేక కృఛ్రచాంద్రాయణాది తపోవిశేషంబులు వీనిలో దేనిచే సిద్ధించును. దానిని వినగోరుచున్నాము గాన వచింపుమన నా సూత పౌరాణికుడిట్లు అనియె. ఓ శౌనకాది మహామునులారా! తాము ప్రశ్నించిన రీతిగానే నారదమహామునివిష్ణుమూర్తినడుగగాభగవంతుండగు శ్రీమహావిష్ణువు నారదునకిట్లు చెప్పెనని శౌనకాదులకుచెప్పదొడంగె. ఒకానొకకాలమందు నారద మహాముని లోకానుగ్రహమును కోరినవాడై సకలలోకములందును సంచరించుచుమనుష్యలోకమునకేతెంచి ఈ మర్త్యలోకమునందు ఆజన్మాంతర పాప

కర్మలచేబాధపడుచుండెడివారలనాలోకించి యిట్టికష్టములను అనుభవించుచుండెడి జనులకు మోక్షసాధనోపాయము దెల్పుమని తాతయగు విష్ణువునడుగగా అమ్మహానుభావు డిట్లనియె. ఓ నారదా! మర్త్య లోకానుగ్రహమునందు మిగుల కాంక్షగలవాడవై మంచిప్రశ్న జేసితివి. మానవుల కేయుపాయంబుచే క్లేశశాంతి జెందునో అట్టి సులభ సాధనంబొండు కలదు. అద్దాని నీకెరింగించెదవినుము. మహామహిమ చేఁగూడిన సత్యనారాయణ యని పేరొందినంబడు నొక వ్రతంబు గలదు. అద్దాని నాచరించినచో ఇహలోకమునందు సుఖములు ననుభవించి పిదప మోక్షమును జెందుదురు. అని నారాయణమూర్తి జెప్ప మరల నారదుడిట్లు ప్రశ్నించెను. ఓ దేవాదిదేవా! నీచే జెప్పబడిన వ్రతమెట్టిది. దాని జేయు విధానంబును పూర్వ మెవరిచే జేయబడినదియు ఈ వ్రతంబు నేకాలంబున జేయవలయునో వీని నన్నిటిని సవిస్తరముగా జెప్పుమని ప్రార్థింప నా శ్రీమన్నారాయణమూర్తి చెప్ప నారంభించెను. ఓ కలహభోజా! ఇప్పుడు నాచే జెప్పంబడిన వ్రతము దుఃఖశోకాది శాంతి ధనధాన్యవృద్ధి సౌభాగ్యంబు సంతతి సర్వకార్య విజయము గలుగజేయును. మరియు నొకానొక మాసంబున నొకానొక దివసంబున మానవుండు భక్తి శ్రద్ధలుగలవాడై ప్రదోషకాలంబున నీవ్రతమును ప్రారంభింప వలయును. మరియు బ్రాహ్మణులు బంధు

మిత్రులతోఁగూడిన వాఁడై భక్ష్యంబులు కదళీఫలములు ఘృతము క్షీరము గోధుమపిష్టము శర్కర గుడము వీనిచే మిళితమగు నైవేద్యంబును భక్తిచే నొనర్చి పిదప బ్రాహ్మణులకు దక్షిణతాంబూలంబుల నొసంగి స్వజనులతోఁ సహా విప్రులతోఁగూడి సత్యనారాయణ వ్రత కథాశ్రవణంబు జేసి పిదప బంధుజనులతోఁ సహా విప్రులకు అన్నదానము నొసంగుటయే గాక నివేదిత భక్ష్యభోజ్యాదులతో పాదాంశంబు దాను భుజించి సత్యనారాయణస్మరణ పూర్వకంబుగ నృత్యగీతాది వాద్యంబులతో గృహంబున బ్రవేశింపవలయు. ఇటుల మానవులు జేసిరేని యిష్టసిద్ధి గలుగుటయేగాక, కలియుగంబున పలువిధభోగ వైభవంబు లనుభవించితుదను మోక్షముఁజెందుదురు. అని మున్ను శ్రీమన్నారాయణుఁడు వ్రతవిధానంబంతయు సూతపౌరాణికుఁడు శౌనకాది మహామునులకు జెప్పిన వాఁడాయెను.

ప్రథమాధ్యాయము ముగిసెను.

## ద్వితీయాధ్యాయము.

ఓ ఋషులారా!

ఈ వ్రతము పూర్వమందెవరిచే నాచరింప బడినదో దానిని జెప్పుచున్నాను వినుడు. సర్వపాప నివారిణియగు కాశీపట్టణమునందు మిక్కిలి దరిద్రుఁడగు నొకవిప్రుఁడుగలఁడు.

అతడు ఆకలిదప్పిచే మిగులవ్యాకులుడై నిత్యముభూమియందు సంచరింపుచుండగా అట్లుతిరుగుచుండిన బ్రాహ్మణుని శ్రీమన్నారాయణమూర్తి వీక్షించి యాబ్రాహ్మణుని యందువాత్సల్యముగలవాడై వృద్ధ బ్రాహ్మణ రూపమున కాశీపురంబు చేరిఆ బ్రాహ్మణునకుప్రత్యక్షమై ఓయివిప్రుడా! విశేషదుఃఖముగలవాడవై యెందుకొరకు ఈభూమియందు సంచరించుచున్నావో దానిని వినగోరుచున్నాను జెప్పుమాయని భగవంతుడు వచించిన వాడాయెను. ఇటుల నారాయణుయొక్క వాక్కునువిని, నేనుఅతిదరిద్రుడను గాన యీభూమియందు భిక్షార్థము తిరుగుచున్నాను. మీకేదైన యుపాయము తెలిసిన కృపచే నానతీయుమని విప్రుడు బల్కెను. ఓబ్రాహ్మణుడా ! నీవడిగినందులకు జెప్పుచున్నాను విన వలయునని నావృద్ధబ్రాహ్మణ రూపుడైననారాయణమూర్తి ఇట్లుచెప్పెను. సత్యనారాయణుడను పేరుగల వ్రతమును జేయుమాయని ఆవ్రతముయొక్క విధానమంతయు బ్రాహ్మణునకు వచించి పిదప సత్యనారాయణ రూపుడగు వృద్ధ బ్రాహ్మణుడు అచటనేఅంతర్ధానమందెను. తమపరిన్నాబ్రాహ్మణుడు యావృద్ధబ్రాహ్మణుని నారాయణమూర్తియని తలచి వానిచే జెప్పంబడిన వ్రతమునాచరించుటకు యత్నించి యారాత్రి నిదురను వదలి యేకాగ్రచిత్తుడై ప్రాతఃకాలమునలేచి సత్యనారాయణ వ్రతము చేయ మనస్సు గలవాడై

ఆ వ్రతమునకు ధనాసక్తిగలవాడై నా గ్రామమందు దిరుగు చుండెను. ఆదినమందే విశేషద్రవ్యము నార్జించి బంధువు లు తాను నేకమై సత్యనారాయణవ్రతమును జేసి సర్వదుఃఖ ములను బోగొట్టుకొన్నవాడై సర్వసంపదలు గలవాడాయెను. అదిమొదలు నావిప్రుడు ప్రతిమాసమందు సత్యనారాయణ వ్రతమును జేసి సర్వపాపనివృత్తిగలవాడై దుర్లభమగు మోక్ష మును జెందెను. గానభూమియందు యేమనుజుడు యెప్పుడీవ్రత మును ఆచరించునో అప్పుడే సర్వదుఃఖములును నశించును. అటుల నారాయణమూర్తి నారద మహామునికి వచించెను. ఇటుల నారాయణునిచే జెప్పంబడినది. మరియు, ఓమహాజనులారా ! భూమియందు ఈ వ్రతము యెవరిచే జేయంబడెనో ఆబ్రా హ్మణుడు విభవానుసారముగా బంధువులతో స్వజనులతో గూడి వ్రతమును జేయ నుద్యుక్తుడైన వాడాయెనో అట్టి కాలమందే ఒకానొక కట్టెలమ్మువాడు నా బ్రాహ్మణుని గృహమునకు వెలుపల కట్టెలమోపునుంచి దప్పిచే బాధింప బడుచు బ్రాహ్మణుని గృహములోనికరిగి యాబ్రాహ్మణుని జూచి నమస్కరించి, ఓస్వామీ! మీచే జేయంబడు వ్రతమెట్టిది దీనిం జేసిన నేమిఫలముగల్గును. దీనిని సవిస్తరముగ జెప్పుమో స్వామీఅని యడిగెను. కాష్టముల విక్రయించువాడా! యీవ్రి తము సత్యనారాయణవ్రత మనంబడును. ఇది సర్వాభీష్టముల నొసంగును. ఈవ్రతానుష్టానములచే నాకు సమస్తమగు ధన

ధాన్యసంపత్తుగలిగినదని నా విప్రుడు జెప్పగా కట్టెలమ్ము వాడువిని మిక్కిలి సంతోషముగలవాడై నీరుగ్రోలి ప్రసాదంబును భుజించి నిజనగరమునకు వెళ్లి సత్యనారాయణస్వామిని మనమున ధ్యానించుచు కట్టెలకు యెంతధనము లభ్యమగునో ఆధనముచే సత్యనారాయణవ్రతమును చేయుదునని సంకల్పించి మానస్సునందాలోచించినవాడై కాష్టభారమును శిరస్సునందుంచుకొని పట్టణమునందు యెచ్చట ధనికులుండిరో అచ్చటకువెళ్ళి ఆకాష్టభారమును విక్రయింపగా ద్విగుణిత ధనమును జెందినవాడాయెను. అనంతరమాందు నిర్మలమనగు మనస్సుగలవాడై బాగుగాపండిన అరటిపండ్లు, శర్కర, నెయ్యి, పాలు, గోధుమపిండి వీనినన్నిటిని సంపాదించుకొని తనగృహమును ప్రవేశించి బంధుజనులతో గూడుకొన్నవాడై యథావిధిగా వ్రతము నాచరించెను. ఆమహాత్మ్యముచే ధనము పుత్రులు వీర్లతో గూడినవాడై యిహలోకమందు సుఖమనుభవించి అంత్యమందు సత్యలోకమునకు వెళ్ళినవాడాయెను.

ద్వితీయాధ్యాయము ముగిసెను.

## —♦ తృ తీ యా ధ్యా య ము. ♦—

శౌనికాది మహామునులారా! నేనువచించెద వినుండని సూతుడు చెప్పదొడంగెను. పూర్వమందు జితేంద్రియుడు సత్యవాక్కు గలవాడునగు ఉల్కాముకుడను రాజుగలడు.

అతఁడు ప్రతిదినము దేవాలయమున కేగుచు బ్రాహ్మణులకు ధనమొసంగుచు విశేషముగ గాలునగు భార్యతోఁ గూడి నదీ తీరమందు సత్యవ్రతము నాచరించుచుండెను. పిదప నావ్రత ము నాచరించుకాలమున సాధువను నొక వైశ్యుఁడు వర్తకము నిమిత్తము విశేషధనము గూర్చుకొనిన వాఁడై వచ్చి ఆ నదీతీర మున ఆయోడనిలిపి ఆవ్రత సమీపమున కేగి వినయపూర్వక కముగ ప్రశ్నజేసిన వాఁడాయెను. ఓరాజా! భక్తియుక్తచిత్త ముచే జేయుచున్న వ్రత మెట్టిది. దానినంతయు వచింపుము, వినగోరుచున్నానని పల్కెను. అటులా వైశ్యుఁడు ప్రశ్నింపగా రాజు, ఓసాధువూ! నేను సంతానముకొఱకు అనంతతేజ స్సుగల విష్ణుమూర్తి పూజయనువ్రతమును సర్వయుక్తుఁడనై యాచరించు చున్నానని వచించిన రాజు వాక్యమును ఆకర్ణించి, వైశ్యుఁడు ఆసక్తిచే ఓరాజా! యీ వ్రతము నంతయును పదేశింపుమూ. నేనూ ఆవ్రతము నాచరించెదను. నాకు సంతానములేదు. ఈ వ్రతమువలన సంతతి కలుగు నని, నిశ్చయించిన వాఁడై రాజుచే నుపదేశింపబడిన వైశ్యుఁడు బేరమును త్యజించి సంతోషయుక్తుఁడై గృహమున కేగి భార్య కు యీ సత్యవ్రతమును జేసిన సంతానము కలుగునని చెప్పి, యెప్పుడు నాకు సంతానము కలుగునో అప్పుడు యీవ్రతము ను చేయుదునని భార్యయగు లీలావతితో జెప్పినవాఁడాయెను. ఒకదినమందు ఆసాధువు భార్యయగు లీలావతి భర్తతో ఆనంద

చిత్తురాలుగను ధర్మము దాశ క్తిగలదై, యుండగా సత్య నారాయణానుగ్రహము వలన గర్భవతియై పదియవ మాస మందు కన్యారత్నమును గనినదాయెను. ఆ కన్యక దినదినము శుక్లపక్షచంద్రునివలె వృద్ధిపొందినదాయెను. ఆకన్యకకు కళా వతియను నామకరణము చేసిరి. అనంతరమందు లీలావతి భర్త యగు సాధువును గూర్చి, ఓ స్వామీ ! పూర్వమందు సంక ల్పించుకొనిన వ్రతమును ఏందు నిమిత్తము జేయరు అని అడి గెను. ఓ ప్రియురాలా ? ఈ వ్రత మా చిన్నదాని వివాహ కాలమందు చేయుదమని భార్య నూరడించి, పట్టణమునకు వెళ్లెను. అనంతరమందు కళావతియను కన్యక తండ్రియొక్క గృహమందు వృద్ధిపొందుచుండగా ఆకన్యను తండ్రి జూచిపట్ట ణమునందుండు స్నేహితులతో కూడా నాలోచించిన వాడై కన్యావివాహార్థము బుద్ధిమంతుని విచారింపుమూఅని ఒకానొక దూతను శీఘ్రముగ బంపెను. అతనిచేనాజ్ఞాపితుడగు దూత కాంచననగరమునకు వెళ్లి ఆపట్టణమునుండి యొక వైశ్యకుమా రుని పిలుచుకొనివచ్చిన వాడాయెను. అటులవచ్చిన సుందరు డును బాలుడును మంచిగుణములుగలవాడునునయిన వైశ్యకు మారుని జూచి జ్ఞాతులతోడను బంధువులతోడను గూడి సంతో షముగ నా సాధువు ఆకుమారునికి కన్యకనిచ్చి యథావిధిగ పాణిగ్రహణము చేయించెను. అనంతరము ఆభాగ్యము వలన

ఆకన్యయొక్క వివాహసమయమందు వ్రతంబును మరచినవా డాయెను. దానిచే నారాయణమూర్తి కోపించినవాడాయెను. అనంతరము కొంతకాలము జరిగినపిదప బేరమునిమిత్తము అల్లునితోకూడ చంద్రకేతుడనురాజకుమారుని నివాసమగు రత్నసాను పురంబునకుజని సముద్రతీరమున ధనికుడగు అల్లునితోసాధువు బేరమును జేయుచుండెను. అట్టికాలమందు సత్యనారాయణస్వామి భ్రష్టప్రతిజ్ఞుడగు సాధువును జూచి దారుణమును కఠినమునగు గొప్పదుఃఖము గలుగునని సాధువగు వైశ్యునికి శాపమిడినవాడాయెను.

పిదప నాదినముననే ఒకానొకచోరుడు రాజుయొక్క ధనమును నపహరించి వెంటతరుము కొనివచ్చు భటులకు భయపడి వైశ్యులుండు చోటవిడచి ఆచోరుడు కనబడక దాగినవాడాయెను. అనంతరము సజ్జనులగు కోమట్లు యెచ్చట నుండునో అచ్చటికిదూతలువచ్చి వారినిబంధించి తీసికొనివచ్చి రాజుయెదుట నిలువబెట్టి ఆజ్ఞనివ్వవలయునని కోరిరి. రాజుచే •ఆజ్ఞబొందినవారలై మిక్కిలి భయంకరమగు కారాగృహమున వారిని బంధించిరి. అటుపిమ్మట వారిధనమునురాజుతీసికొనెను. సత్యనారాయణస్వామి శాపమువలన గృహమందు భార్యదుఃఖితురాలాయెను. మఱియు గృహమందుండుధనమునపహరింపబడెను. ఆవైశ్యునిభార్య మనోవ్యధచేతనువ్యాధులచేతను బాధితురాలునుఆకలిదప్పి వీటిచే అతిదుఃఖితురాలును, అన్నములేక

చింతతోగూడినదై ప్రతిగృహమునకు తిరుగుచుండుటయేగాక కుమార్తెకూడ తిరుగుచుండెను. పిదపనొకదినమందుఆకలిచేత గృహమునుండి బయలువెడలిరాగా నొకస్థలమందు సత్యనారాయణవ్రతము జేయుచుండ నావ్రతముజూచి యాకథనువిని వరములుకోరి ప్రసాదమును భుజించి రాత్రి గృహమునకు వెళ్లెను. ఇటులవచ్చిన కళావతిని తల్లిజూచి నో కూతురా, రాత్రి యెచ్చటనుంటివి. నీమనస్సు యెందుండినది అని తల్లిఅడుగగా నో తల్లీ ఒకబ్రాహ్మణ గృహమందు కోరిన కోరికలనిచ్చు వ్రతమును జేయుచుండ నది జూచుచుంటినని పలుక తల్లియైన లీలావతివిని సంతోషముతో సత్యనారాయణవ్రతమును జేయ నుద్యుక్తురాలై బంధువులు స్వజనులు వీర్లతోగూడి వ్రతమునుజేసియోస్వామినాభర్తతప్పుక్షమింపుము అనిస్తోత్రముచేయ నారాయణమూర్తియీవ్రతముచే సంతోషించి చంద్రకేతమహారాజునకు స్వప్న దర్శనమిచ్చి ఓ చంద్రకేతుడా! కారాగృహమునం దుంచబడిన వైశ్యులను విడుదలచేయుము. నీచేగ్రహింపబడినవారిధనమునిమ్ము అటుల నివ్వకున్న నీరాజ్యమును ధనమును పుత్రులను నిన్నును నశింపజేయుదును. అని నుడివి అంతర్ధానమందెను. పిదప రాజు స్వజనులతో సభామధ్యంబున గూరుచుండి తనకుగలిగన స్వప్నంబునుజెప్పి కారాగృహమునందుంచబడిన వైశ్యులను విడుదలచేయించి వారిని రాజునెదుటకు తీసుకొనివచ్చి

నిలిపిరి. వైశ్యులు పూర్వవృత్తాంతము తలంచుకొనుచు భీతిచే నిలువబడిరి. రాజువారినిజూచి శాంతమును వహించి దైవ వశమువల్ల యీదుఃఖము సంభవించినది. ఇపుడు మీకేమియు భయములేదని యూరడించి క్షౌరకర్మజేయించి వస్త్రముల నిచ్చి సంతోషింపజేసి వైశ్యులను ముందుంచుకొనినవాడై మాటలచే సంతోషముగలుగజేసి పూర్వము తనచేగ్రహింప బడిన ధనమునకు ద్విగుణముగా వారికిచ్చి, ఓసాధూ! మీగృహ మునకు జేరుమని శెలవిచ్చిన నారాజునకు నమస్కరించి మీ యనుగ్రహమువల్ల వెళ్ళివస్తామనిన వారైరి.

మూడవాధ్యాయము ముగిసెను.

## చ తు ర్థా ధ్యా య ము.

ఇటుల సాధువను వైశ్యుడు రాజుయొక్క ఆజ్ఞను పొందినవాడై మంగళాయతన పూర్వకంబుగ ప్రయాణము జేసి బ్రాహ్మణులకు ధనమొసంగి తన ఆశ్రమమునకు పోవు చుండగా సత్యనారాయణస్వామి త్రిదండసన్యాసివేషధారియై ఓసాధూ! యేలచింతజేయుచున్నావు. నీయోడయందుయేమి యున్నదని అడుగగా వైశ్యులువిలాసముగా పరిహాసించిఓదండీ నేమియనుచున్నావు. నావయందు ధనము అపహరించుటకే యత్నించు చుంటివా. అట్టిదేమియు లేక వలయు పాత్రలు యున్నవి.గానిమరియొకటిలేదు.అనిపలుకగానాసన్యాసియగుశ్రీ

సత్యనారాయణమూర్తి నీమాటయేసత్యము, అనిపలికి కొంత దూరమువెళ్ళి సముద్రతీరమున నివసించెను. ఈ ప్రకారము దండివెళ్ళిన తరువాత సాధు నిత్యకృత్యంబులు దీర్చుకొనిలేచి యోడయందుండు లతాదికములు చూచి మూర్ఛితుడై కొంతసేపటికి తెలివినిపొంది తరువాతచింతనుపొందెను. అప్పు డల్లుడొకవాక్యము పలికెను.

ఓ మామా! యెందుకుదుఃఖించడము. దండిచే శాప మివ్వబడినది. ఆదండి సమస్తమును జేయుశక్తిగలవాడు గాన వేగమె శరణుపొందుము. అను, అల్లునివాక్యముల కలరి యా సాధువు దండిసమీపమునకువెళ్ళి అతనిజూచి భక్తిచే నమస్కరించి తానుజేసిన యపరాధమును క్షమింపుమని మాటిమాటికి నమస్కారము జేసినవాడై గొప్ప వ్యాకులతచే దుఃఖముతో నున్నయావైశ్యునిజూచి, వినుము! నాయొక్క పూజావిముఖుడవయితివి. గానఓ దుర్బుద్ధిగలవాడా నాయొక్క ఆజ్ఞచేమాటి మాటికి దుఃఖము గలుగుచున్నదని చెప్ప. మాటలువిని స్తోత్రముజేయ నారంభించెను. ఓనారాయణమూర్తి! బ్రహ్మ మొదలయిన దేవతలు మీమాయాచే మోహితులగుదురుగాన మూఢుడనగు నేను మోహితుడనై మీ స్వరూపమును యెటుల తెలుసుకొనగలవాడనగుదును. గానప్రసన్నుడవయి శరణాగతుడైన నన్ను రక్షింపుమని పలికినవాక్యమును నారాయణమూర్తి వినినవాడై సాధువు కోరినవరమిచ్చి అచటనే

అంతర్ధానమందెను. పిదప ధనముచే నిండిన యోడనెక్కి సత్యనారాయణునికృపచే నాకోరిక సఫలమైనదని చెప్పుచు యోడను గదలించినవాడాయెను. అనంతరమాసాధువు అల్లుని జూచి, అల్లుడా! నాయొక్క రత్నపురమును జూడుమా అని చెప్పి ద్రవ్యరక్షకుడగు దూతను పిలిపించిన వాడా యెను. ఆదూత పట్టణమునకు వెళ్ళి సాధువు భార్యనుజూచి ఇష్టమగువాక్యములు బలికి నమస్కరించిన ఈ పట్టణ సమీప మున సాధువుయల్లునితో గూడియున్నాడని చెప్పు దూతవా క్యంబునువిని సంతోషచిత్తురాలై సత్యనారాయణ పూజజేసి ఓకూతురా! సాధువుదర్శనమునకు వెళ్ళెదము రమ్మని కుమా ర్తెను పిలచెను. తల్లివాక్యమునువిని సత్యనారాయణ వ్రతము సమాప్తిజేసి ప్రసాదమును భుజించక, కన్నతల్లితో భర్తను గూడి వెళ్ళినదాయెను. అందుచే సత్యనారాయణమూర్తి కోపించినవాడై భర్తనుధనమును వాడతో గూడసముద్రమందు ముంచిన వాడాయెను. కళావతియను కన్య భర్తనుగానక దుఃఖముచే భూమియందుబడి రోదనంబుజేయుచున్న కన్యను చూచి సాధువు భయయుక్తుడై మనస్సున నిదియేమి ఆశ్చర్య మని వచించినవాడాయెను. అచ్చటనుండు తీరవాసులు విశేష చింతగలవారైరి. అనంతరము లీలావతియును దుఃఖ పరవశురాలై విశేషదుఃఖముచే విలపించుచు భర్తనుగూర్చిన వాక్యమును బలికెను.

ఓ స్వామీ! యిప్పుడు నీ యల్లుడు ఓడతో కనబడక పోయెను. ఏదేవుని విలాసముచే అపహరింపబడెనో తెలి యదు. సత్యనారాయణునియొక్క మహాత్మ్యమును తెలిసి కొన శక్తులెవరు. అనివిలపింపగా దానిజూచికళావతితల్లియగు లీలావతియును బంధువులును నేకమై యాకన్యనుబట్టుకొని విశేషముగ రోదనముచేసినవారైరి. కళావతియును భర్త నశించుటచేత మిక్కిలి దుఃఖముగలదై పెనిమిటి పాదుకలను గ్రహించి అనుగమనము చేయజూచెను. ఇటుల ఆకన్యక యొక్క చరిత్రజూచి ఆ సాధువు భార్యతోకూడా అత్యంతశోక మున సంతలప్తుడై యీమాయ సత్యదేవునిదా! లేక సత్య దేవునిమాయచే నేను భ్రమించితినాయని చింతించుచు నిట్లు పలికెను. అయినను మనము శక్తిచే సత్యదేవుని పూజను జేయుదమని యందరిని బిలిచి తనకోరిక అందరికి తెలియజేసి సత్యదేవునకు మాటిమాటికి సాష్టాంగనమస్కారములు జేసిన వాడాయెను. సత్యదేవుడు అతని భక్తివిధేయతను గాంచి భక్తునిగూర్చి ఒక వాక్యమును బలికెను. ఓసాధూ! నీ కన్య నాప్రసాదమునుత్యజించి భర్తనుజూచుటకు వచ్చెను. గాన, ఆకన్య భర్త కోపించెననగా నాకన్య గృహమునకు వెళ్ళి ప్రసాదమును భుజించి మరలజని భర్తను జూచినదాయెను. కళావతియును వేగముగ గృహమునకు వెళ్లుము అని చెప్పిన సంతోషముగలవాడై సత్యదేవుని పూజను యథావిధిగ

జేసి బంధువులతో నిజగృహమున పూర్ణిమ యందును, సంక్రాంతియందును, సత్యదేవుని పూజజేసి ఇహలోకమందు సుఖ మనుభవించి అంత్యమున సత్యపురమునకు వెళ్ళిన వాడాయెను.

నాల్గవ అధ్యాయము ముగిసెను.

## —♦ పంచమాధ్యాయము ♦—

మునిశ్రేష్ఠులారా! వేరొకకథను జెప్పుచున్నాను వినుడు. ప్రజలను పాలించుటయందాసక్తిగల తుంగధ్వజుడనురాజు సత్యదేవునిప్రసాదము భుజించక దుఃఖమును పొందినవాడయి ఒకానొక సమయమందు యుద్యానవనమునకు వెళ్ళి అనేకవిధములగు మృగములజంపి మిక్కిలిబడలి యచట నొక వృక్షమూలముననిల్చి దాని మూలయందు గోపకులు భక్తియుక్తులై బంధువులతోగూడి సత్యదేవుని పూజచేయుచుండగా రాజువారింజూచి యచటకరుగక గర్వమున నమస్కారముగూడా చేయనివాడాయెను. మరల గోపకులు ప్రసాదమును రాజెదుట నుంచి తిరిగివెళ్ళి భుజించిరి. రాజు ప్రసాదము నుత్యజించుటచే పుత్ర శతకమున్ను ధనధాన్యము మొదలయినవి నశించెను. రాజు సత్యదేవుని మహాత్మ్యముచే నాపుత్ర పౌత్ర దనాధికములు నశించినవని

గోపాలుర సన్నిధికేగి భక్తిచే సత్యదేవుని పూజనుజేసి యతనియనుగ్రహముచేధనమును,పుత్రులనుతిరిగిబడసినవాడై ఇహలోకమందు సుఖ మనుభవించి అంత్యమున సత్యపుర మునకు వెళ్లినవాడాయెను. ఎవరు మిక్కిలి దుర్లభమగు సత్యవ్రతము చేయుచున్నారో వారు సత్యదేవుని కృపచే ధన ధాన్యాధికమును బొందుదురు. దరిద్రుడీవ్రతము చేసినధనధా న్యపుత్రపౌత్రాది సంపత్తులను జెందును. బద్ధుడు బంధమువలన విముక్తుడగును, భీతుడు భయమువలన విడువంబడి కోరినఫల మును అనుభవించినవాడై అంత్యమందుసత్యపురమనకేగును. శౌనకాది మహామునులారా ! యే వ్రతముచే మనుష్యుడు దుఃఖ విముక్తిగలవాడగునో అట్టి సత్యనారాయణ వ్రతమును జెప్పితిని. విశేషముగ కలియుగమందు సత్యదేవుని కొందరు సత్యనారాయణుడనిన్ని కొందరు సత్యదేవుడనిన్ని జెప్పుదురు. సత్యదేవుడు నానారూపములఁధరించి సమస్తజనను లకు కోరికల నిచ్చువాడై సత్యరూపుడు కాగలడు, గాని, ఓముని శ్రేష్ఠులారా! యీవ్రతము నిత్యము యెవరుపఠింతురో వారిపాపములు సత్యదేవునికృపచే నశించుచున్నవని సూతుడు శౌనకాది మహామునులకు జెప్పినవాడాయెను.

ఇది శ్రీస్కాంద పురాణమందలి రేవాఖండ మందుండు

సత్యనారాణ వ్రతకథ ముగిసెను.

రాగము:—సకతాళము

ప॥ మంగళహారతు లివరె । మనసత్యదేవునకిపుడు

అ॥ రంగుగ రమణులంత । బంగరు పళ్లెముతో ॥మం॥

౧॥ కంజాక్షి హారతులియవే । కమలనాభునకిపుడు
కంతుశతకోటి తేజు । కమల సహితునకు ॥మం॥

౨॥ హారతులియవె రాధమన । నాకీలోలున కిపుడు
కోరిన వరములొసగు । నీరజాక్షునకు ॥మం॥

3॥ శంకర సన్నుతునకును । శంకర వినేత్రునకు
వేంకట రత్నవరదు । వేదవేద్యునకు ॥మం॥

గద్య.

ఇది శ్రీ సుందరరామ కరుణాకటాక్ష లబ్ధకవితాధారేయ
విశ్వబ్రాహ్మణకుల సుపర్ణసగోత్రోద్భవ సబ్బవరపువంశ
పయఃపారావార సుధాకర బుచ్చిలింగపౌత్ర గురు
మూర్తి అచ్చమాంబ ద్వితీయ పుత్రుడును
వాస్తుదైవజ్ఞ విశారదాది బిరుదాంకితులగు
సింహాచల సహోదరుడునగు చినవెం
కట రత్నాచార్య ప్రణీతంబైన
సత్యరమేశ శతకము
సర్వము
సంపూర్ణము.

